# SATI TULASI.

# సతీ తులసి

ప్రకటనకర్త :

పోలిశెట్టి రామయ్య,

శ్రీ సీతారామాంజనేయ కంపెనీ,

బెజవాడ.

[illegible]

౧-౦-౬.

శ్రీ రస్తు.

# సతీతులసి.

ఒకనాఁడు దేవేంద్రుఁడు పరమేశ్వరుని దర్శించుటకుఁ గైలాసమునకుఁ బోయెను. ఆసమయమునఁ బార్వతీదేవి యోగసమాధిలో నుండెను. ఆమె యోగమునకు భంగముకలుగకుండ నీశ్వరుఁడు ప్రమధవేషధారియై ద్వారమున నిలిచియుండెను. ఇంద్రుఁడువచ్చి ద్వారమున నిలిచియున్న హరునిఁ జూచి లోనికిబోనిమ్మని అడిగెను. ఆతఁడు వీలుతేదనెను. అంత నిర్జరేశ్వరుఁడు ఆతని నొక ప్రమధునిగా భావించి త్రిలోకాధినాధుఁడనగు నన్ను నీవు నిరోధింతువాయని క్రోధించి, ఆతనిఁ జంపవజ్రము నెత్తెను. పాకశాసనుని దుర్మదాంధతకు నంధకవైరి కినుకవహించి తన ఫాలనేత్రమును దెరచెను.

అందుండి భయంకరంబగు నొక అగ్నిజ్వాల బయలువెడలెను. ఇంద్రుడప్పుడాతని చంద్రశేఖరునిగా నెఱింగి అతనిపాదములపైబడి క్షమింపుమని ప్రార్థించెను. ఆప్రసన్నుండగు నాపన్నగభూషణుండు నృత్తినెరియెడల గనికరముబూని నిజనిటలనేత్రసంజనితాగ్నికీలనుదీసి సముద్రమునబడునట్టు విసరివైచెను. ఆమంటయే యొక శిశువయ్యెను. ఆశిశువు జలముచే ధరింపబడినవాడగుటచే జలంధరుడనుపేరున వ్యవహరింపబడెను.

జలంధరుఁడు జన్మించినప్పుడు విష్ణుదేవుఁడు మొదలగు దేవతలు అతనిఁ జూచుటకుపోయి సరిత్పతిచే నాబాలుని తమచెంతకు దెప్పించిరి. విష్ణుదేవుఁడా బాలుని చక్కదనమునకు నక్కజపడి వానినెత్తుకొని ముద్దాడబోయెను. అప్పుడు వాఁడు భయంకరరూపముందాల్చి యాతని కుత్తుకను గట్టి

గాఁబట్టుకొనెను. అప్పుడు రమానాథుఁడు వాఁశిసి రక్కసునిగా నెఱింగి చక్రమునవధింపనెంచ వాఁడు పరమేశ్వరాంశమున జనించినాఁడని వచించి ధాత యాతని వారించి వగుణుని బాలుని పెంపనియమించెను. పిమ్మట దివ్యులు తమ నివాసములకుఁజనిరి.

జలంధరుఁడు కొన్నిదినములకు పెద్దవాఁడై దానవసైన్యములంగూర్చుకొని పెక్కు దేశముల జయించెను. ఆతని పరాక్రమమునకు మెచ్చి ఒకదానవుఁడు తనపుత్రికయగు తులసినిచ్చి పెండ్లిచేసెను. ఆమెకే బృంద యనిమరియొకనామముకలదు.

జలంధరుఁడొనర్చు దుండగములు నానాటికి పెచ్చుపెరుగుచుండెను. దేవతలును, మునులును, ఆతడుపెట్టు బాధలకు తాళఁజాలక పరమేశ్వరుని చెంతకుబోయి మొఱవెట్టికొనిరి: హరుండువారికభయమిచ్చి జలంధరునిపై 'దాడివెడలి చంద్రి

భాగాతీరమున జలంధరునితో యుద్ధమునర్చెను. పరమేశ్వరుడెన్ని అస్త్రముల ప్రయోగించినను వాడు చావకుండెను. అందులకు వాని భార్యయగు తులసీదేవి పాతివ్రత్య ప్రభావమే కారణమని ఈశ్వరుడు గ్రహించి ఆమె వ్రతభంగము గావించుటకు విష్ణుదేవుని వేడుకొనెను.

నారాయణుండును జలంధర వేషము దాల్చి తులసికడకుబోయి ఆమెనుమాయచేసి వ్రతభంగము గావించెను. పరమేశ్వరునిచే జలంధరుడు చంపబడెను. పిమ్మట తులసి ఆతని కృత్రిమజలంధరునిగా నెఱింగి పాషాణముగమ్మని శపించెను. శేషశయనుడు పాషాణమయ్యెను. లక్ష్మీదేవి వచ్చి తులసిదేవిని తనకు పతిభిక్ష పెట్టుమని ప్రార్థించెను. నీ జతింజొచ్చిన యెమ్మట ఆతడు స్వరూపమును దాల్చునని ఆమెకువరమిచ్చి తులసి అగ్నింబ్రవే

పించి దేహముజాలించెను. తరువాత విష్ణుదేవుండు తన స్వరూపమును దాల్చెను.

తులసీదేవి నారాయణుని జలంధరుడని భ్రమపడుటంజేసి యామెకు వ్రతభంగము గలిగె. అంత మాత్రమున నాసాధ్వీ సతీత్వమునకు భంగము వాటిల్ల లేదని దివిజులామెను సతీతులసియని ప్రస్తుతించిరి.

ఈకథ నిత్యము పఠించినవారు సకలైశ్వర్యములతో తులదూగుచుందురు.

స మా ప్త ము.

---



